# శరధార



ఊటుకూరు రంగారావు

ప్రచురణ:

భారత సాహిత్య కళా పరిషత్

మోహన్ రోడ్ – ఖమ్మం.

# ప రి చ య ం

ఉత్సాహం అందుకుతగిన నిర్మాణాత్మకశక్తి గలిగి, కార్యసాధనకు కావలసిన సాధనసంపత్తిని ఒనగూర్చుకొని, జనాంతికంలో తానొక విశిష్టవ్యక్తిగా, కలహాదారుడుగా వుంటూ నిస్వార్థమైన సాహిత్యసేవజరుపుతూ 33 సంవత్సరాల స్వల్పకాలికవ్యవధిలోనే శ్రీ ఊటుకూరు రంగారావు అస్తమించడం ఖమ్మంజిల్లా సారస్వతోద్యమానికి తీరని అఘాతం. ఖమ్మంజిల్లావాసులు ముఖ్యంగా యువతరం అందరిలో ఆకర్షవ్యక్తిగా, అనుంగు సోదరుడుగా స్థిరనివాసం కల్పించుకోవడం, ఈ స్వల్ప జీవితకాలంలోనే ఈ యువ సాహితీ తేజఃకళిక జిల్లా సారస్వత నందనోద్యానవనంలో దిగంత పరిమళ సంభారవాయువుల్ని పరచి. సహృదయ హృదయాహ్లాదకరంగా ప్రవర్తిల్లడం, అదంతా ఒక మధుర స్వప్నఘట్టంగా భాసిల్లుతున్నది.

ఖమ్మంజిల్లా మధిర తాలూకా నారాయణపురం అనే కుగ్రామంలో శ్రీ ఊటుకూరు 1929 వ సంవత్సరంలో జన్మించారు. ఉన్నతసంస్కారపూరితమైన అతి సాధారణకుటుంబంలో వీరుజన్మించారు. వీరి తండ్రిగారు, జనయిత్రి

సోదరీసోదరులు అందరూ కవితాభిమానులే కాక కవిత్వం కూడా చెప్పగలిగినవారు. ఈ సంస్కారబలమే శ్రీ రంగారావులో అందరికంటే విశిష్టంగా విద్యోతించి, ప్రాచీనాధునికరీతిరమ్యాకృలతో నవ్య కవితాకుమారి ఈతనిని వరించింది. పరిపక్వ గంభీరమైన భాషామార్దవం, చిపురాకు మెత్తనైన శబ్దపల్లవాల సొగసు, సుమధుర పరిమళసంభరితమైన విషయజ్ఞానగల ఈతని శైలి రసహృదయులను అమితంగా ఆకర్షించింది... అలరించింది. తత్ఫలితంగా అనేక పద్యఖండికలను, గేయాలను రచించారు.

శ్రీ రంగారావుకు ఇరవై సంవత్సరాలు నిండకముందే తెలంగాణావిమోచనోద్యమం విప్లవధ్వజమెత్తింది. అనేక మంది జాతీయప్రేమికులైన యువకులు ఆనాటి నిజాం నిరంకుశ అంధపాలనకు వ్యతిరేకంగా కాశగట్టి సమరోన్ముఖులైనారు. మిల్లుకూలీలు, రైతులు, కార్మికులు ఒకరేం? అనేకులు, అనేకరంగాలలో పనిచేసేవారు విప్లవం రేకెత్తించారు. యువకవులు తమ శక్తివంతమైన కవితారచనద్వారా గ్రామ ప్రజల్లో చైతన్యవెల్లువను ఉప్పొంగించారు. తెలంగాణా ప్రాంతంలోని ముఖ్యంగా ఖమ్మంజిల్లానుండి కవులు, రచయితలు ఈ ఉద్యమానికి మరింత బలాన్ని చేకూర్చారు. అప్పటి యువకవులలో శ్రీయుతులు దాశరధి, హీరాలాల్ మోరియా, ఊటుకూరు రంగారావు, తాళ్ళూరి రామానుజస్వామి, చందాల రామకవి మొదలైనవారున్నారు.

కుటుంబ బాధ్యతలమూలంగా అప్పటికే విద్యకు స్వస్తి చెప్పి జీవికను నిర్వహిస్తున్న రంగారావు స్వాతంత్ర్యోద్యమంలో ధైర్యోపేతంగా అడుగు పెట్టాడు.

రజాకార్ అమానుష దురంతకృత్యాలకుగురియై హతాశులైన జనసందోహాన్ని వెన్నుతట్టి, ఆ దుర్మార్గాలను అంతమొందించడానికి శ్రీ ఊటుకూరు వందలాది గేయాలను రచించి ప్రజలను ఉద్వేగపూరితుల్ని చేశాడు.

"తప్పదు...
పల్లెటూళ్ళ హృదయాల్లోని
ప్రళయాగ్ని వర్షిస్తుంది
మానవహరణోద్యోగంలోంచి
మంటలు ప్రభవిస్తవి.
ఎగిరిపోతై ఇనప తెరలు...
మారిపోతై సాంఘికధర్మాలు
స్మశానాల్లో సగంకాలిన శవాలకి
ప్రాణప్రతిష్ఠ జరుగుతుంది"

అని హెచ్చరించి అణగారిపోయిన ప్రజాహృదయాలలోని విప్లవార్చిస్సులను పెచ్చరిల్లచేశాడు. దురంతాలకు ఆహుతై యశఃకాయులైన అనేకమంది అమాయికసోదరులనుగురించి కన్నీరుకారుస్తూ మానవత్వంకోసం మంచికోసం, మనుగడకోసం ప్రాణాలర్పించిన జాతీయవీరులకు శ్రద్ధాంజలిఘటిస్తూ—

"ఎందుకోసం చచ్చారో

అంతుకోసమే బ్రతకాలిమళ్ళీ"

అని మానవత్వంమీద, మనుగడమీద ఆశాసుమాల్ని చల్లి సమాశ్వాసిస్తాడు.

వర్గవిభేదాలతో జాతిని చిక్కులకుగురిచేసి ఒకళ్లొకళ్ళ ఉనికిని ద్వేషిస్తూ, హక్కుల్ని దోచుకునేపద్ధతికి దిగజారిపోగా ఏర్పడిన రాజకీయ విషవలయాన్నిచూచి శ్రీ రంగారావు హృదయం తీవ్రసంక్షోభంచెందింది. దీన్ని తీవ్రంగా నిరసిస్తూ తన వజ్రకంఠంతో పెనుగర్జనస లిపి సంఘవ్యతిరేకశక్తులకు హడలుపుట్టిస్తాడు.

"సమతావాదం నాది,
సహజసంపదలు నావి,
హక్కు అ్రమింగేవాళ్ళని
ముక్కలుకొట్టేస్తాను.
నా కవితా విలయాగ్నిలో
భస్మం చేసేస్తాను...."

మరొకచోట

"బ్రతుక లేక వెర్రెత్తిన
అతిబాధాపీడితులు
ఎండవానలకి సముముగ
వాళ్ళొంచే రైతుజనులు
బ్రతుకును నరకంగాభావించే శ్రమికజనులూ,
నిరాశ్రయులు, నిరుపేదలూ

నిర్జీవులుసైతం నా కవిత్వాన్ని వింటాయి.
నా కవితా సుధాధారల్తో
ఈ దరిద్రప్రపంచాన్ని
స్వర్గంగా మార్చేస్తా.
నాకెవ్వరిభయం లేదు...
నాకొకరిదయ పనికిరాదు
తప్పకపాడేస్తానొక
నిప్పుల తుపానుగీతం..."

అని తన కవిత్వాన్ని దీనమానవశ్రమాపనయనంగా అభివర్ణించి, స్వేచ్ఛావిప్లవఝంఝానిలగీతాన్ని పాడతాడు.

కవిత్వంపైగానీ, వ్యక్తిత్వంపైగానీ ఏ ఇతర ప్రభావం పడటం శ్రీ రంగారావు యెంతమాత్రం సహించేవాడుకాడు. జాతీయాభిమానం, ఉన్నత ఆదర్శం రెండూ హెచ్చుగాగల సాహిత్యపరుడాతడు. వివిధ దేశాల సంస్కృతీ, ఆచారాలు, సామాజిక జీవనవైఖరి నిశితంగాపరిశీలిస్తూ అన్నింటికీమించిన మన భారతీయసంస్కృతీ ఔన్నత్యాన్ని, అందులోని విశిష్ఠతనూ శ్రీ ఊటుకూరు అమితంగా ప్రేమించేవాడు. జీవితం లోని ఉన్నతాదర్శ శిఖరాలనుండి, ఎన్నడూ ఎట్టి సంక్లిష్ట పరిస్థితిలోనూ ఆతడు దిగజారలేదు... అన్యాయంసహించ లేడు. ఆత్మాభిమానానికీ, వ్యక్తిత్వానికీ భంగంకలిగించే ఏ చర్యనూ అతను జరుపలేడు... జరుగుతూండగా చూసి మిన్నకుండలేడు

"పరకాయప్రవేశవిద్య నేర్చిన మానవుడు
పిశాచాల శరీరాల్లో
ప్రవేశించి, నర్తిస్తూ
భూనభోంతరాళాలు విరిగి చెక్కలయ్యేట్టు
వికృతంగా నవ్వి
మానవత్వాన్ని ఖూనీ చేసి
శ్మశానానికీడుస్తున్నాడు."

అని మానవులలోని కృత్రిమత్వాన్ని, అసహజత్వాన్ని అసహ్యించుకున్నారు.

అణుశక్తి నిర్మాణోద్యమంలో అహరహమూ పోటీల్లో పడి భయంకర యుద్ధవాతావరణాన్ని సృష్టించే పెద్ద దేశాలను దుయ్యబడుతూ అవి ప్రేరేపిస్తున్న యుద్ధజ్వాలలను గురించి, అందువల్ల కలిగే భయంకర విషపరిణామాలను ఈవిధంగా వర్ణించారు.

"యుద్ధం...!
కమ్ముకొంది దశదిశల
గంభీర యుద్ధజ్వాల
దిక్కుదెస తోచక
కుక్కచావు చచ్చేనరులు
కడుపుకోత తాళలేక
నడివీధిన నిలిచిన మనుషులు..."

మానవుడు, మానవుడుగా మసలిగే మంచి ఘడి యలకోసం శ్రీ రంగారావు ఎంతో తహతహపడేవాడు. మతం, వర్ణం, ఇవన్నీ మానవుణ్ణి, మానవుణ్ణే దూరం చేసే పద్ధతికి దిగజారినవనీ, సమాజైక్యతావిచ్ఛిత్తికి ఇవి నిలయాలైనవనీ ఈ విభేదాలు నశించే విప్లవాత్మకమైన మార్పు అత్యావసరమనీ ఆయన అనేవాడు. కష్టదశ అనేది ఎవరికి ఏ రూపంలో వచ్చినా, పర్యవసానం ఒకటిగానే వుంటుందనీ, అట్లాంటివారికి తోటివారు చిత్తశుద్ధితో, ప్రతిఫలాపేక్ష లేకుండా సహకరించడం సముచితమైన మానవతాధర్మం అని అనేవాడు. ఈర్ష్యాసూయలు లేని మనస్సుల్లోనే నిస్వార్థమైన సేవాభావం అంకురిస్తుందనీ, అట్టి వ్యక్తియే సమాజౌన్నత్యానికి ఉజ్జీవనత కల్పించగలదనీ ఆయన ప్రగాఢవిశ్వాసం. శ్రీ రంగారావు తన జీవితకాలంలో ఈ విశ్వాసానికి అంకితమైపోయాడు అందరి మంచితనానికీ, మన్ననకీ పాత్రుడైనాడు. ఆయన స్నేహావరణంలో అందరూ పరిమళసంభరితమైన కుసుమరాజాలే.

1949 నుంచి 58 వ సం॥ వరకు శ్రీ రంగారావు అవిరళంగా రచనలు కొనసాగించాడు. అప్పటినుండే రచనలతో పాటు పత్రికారచనకూడా ప్రారంభించి, జిల్లాలోని అనేక సాంఘిక, రాజకీయ, వైజ్ఞానిక సంబంధ కార్యక్రమాలకు ఎనలేని ప్రచారాత్మకసేవాకృషిని అందించాడు. 56 నుండి ఖమ్మంజిల్లా హిందీ ప్రేమీమండలి కార్యదర్శిగా, జిల్లా రచయితలసంఘ కార్యదర్శిగా అంతకుపూర్వం తెలంగాణా

రచయితలసంఘం ఖమ్మంశాఖకు కార్యదర్శిగా పదవీ బాధ్యతలను నిర్వహించాడు. సుమారు 6 సంవత్సరాలపాటు ఖమ్మం పట్టణ విజ్ఞాననికేతన గ్రంథాలయ లైబ్రరియన్‌గా ప్రశంసార్హమైన సేవ చేశారు. పద్యం ఎంత చక్కగా వ్రాసేవారో వచనం అంత పరిహాసద్యోతకంగా వ్రాసేవారు. ఆతని చేవ్రాలు ముత్యాలసరంవలె ఎంతో ముచ్చటగొలుపుతుంది

ఖమ్మంజిల్లా అభ్యుదయసాహిత్యపరులలో ముకుటస్థానీయుడైన శ్రీ ఊటుకూరు రంగారావు గత మార్చి 11 వ తేదీన వైరాగ్రామంలో గుండెపోటుకు గురై హఠాత్తుగా అస్తమించారు. ఈ దారుణ సంఘటనకు జిల్లాలో ప్రతి యువ హృదయం బెగ్గడిల్లింది. అందరి మంచితనంలో సదాశయంలో మెలగే అత్యంత ప్రియమిత్రం అస్తమించడంవల్ల కలిగిన లోపం తీర్చరానిది. నిరుపేద కుటుంబజీవనం గడుపుతూ ముక్కుపచ్చలారని పసిపాపనూ, భార్యను, సోదర సోదరీమణులను అందరినీ వీడి ఈ యువసాహితీ తేజఃకళిక మలగిపోయింది.

శ్రీ రంగారావు తెలుగు, ఉర్దూ ఈ రెండుభాషల్లో సముచితమైన పాండిత్యప్రకర్ష కలవాడు. ఉర్దూభాషనుండి అనేక కథలు కవితలు అనువదించి ఉర్దూ భాషకుకూడా ఎనలేని సేవ చేశారు.

ఈ "శరధార" కవితాసంకలనం నిఖిలాంధ్ర సోదరులకాదరణపాత్రమౌతుందని విశ్వసిస్తున్నాను.

ఖమ్మం
దీ 15-8-1963

కొలిపాక మధుసూదనరావు
కార్యదర్శి: జిల్లా రచయితల సంఘం

# ఒ క మా ట

ఒకసందర్భంలో ఉర్దూ మహాకవి "జోష్" సహృదయుడు కాని వాడు నాదృష్టిలో కవికాడు. ఒక గొప్పవ్యక్తి ఈ ప్రపంచంలో ఏదైనాకావచ్చు— కాని కవికాలేడు—. అని అన్నాడు.

శ్రీ ఊటుకూరు రంగారావుగారిలోవున్న గొప్పతనమల్లా అతడు సహృదయుడుకావడమే. ఏ దృష్టితోచూచినా అతడొక గొప్పవ్యక్తి. శ్రీరంగారావు కవిత్వంలో అసహజత్వం ఏమీవుండదు. అతని కవిత్వం, కథలు, మాటలధోరణి అన్నీ జీవితంలో వాస్తవపరిస్థితులను ప్రతిబింబంగావుంటవి బాల్యం నుంచే అతను జీవితపుఒడుదొడుకుల్ని ఎంతో ధైర్య సాహసాలతో ఎదుర్కొంటూ ముందుకు సాగిపోయాడు. జీవితంలో అనేక కష్టాలకు గురికావలసివచ్చినా, అతను ధైర్యాన్ని కోల్పోకుండా ముందుకు వెళ్ళేడేకాని, నిస్పృహ ఎన్నడు చెందివెరగడు.

శ్రీ రంగారావు స్వల్ప వయఃపరిమితిలోనే అకస్మాత్తుగా తనువు చాలించడం భాషాభిమానులకు, మిత్రులకు, విద్యుద్ఘాతమైపోయింది. అయినా ఆయన రచనల్లో శాశ్వత స్థానాన్ని భద్రపరచుకున్నాడు.

భారతసాహిత్యకళాపరిషత్ పక్షాన ప్రస్తుతం "శరధార" అను ఈ ఖండకావ్య సంపుటిని ఆంధ్రసోదరులకు అందించుచున్నాము. ఈపరిష్కరణలో సహాయపడిన మిత్రులు శ్రీయుతులు బి.పర్వతాలరావు, సి. హెచ్. వెంకట్రామయ్య, మధుసూదనరావు, పుల్లాభొట్ల, మాదిరాజురంగారావు, రావు పాటి సత్యనారాయణరావు, వ్యాటూకూరు రంగారావు బి.ఎ.బి.ఇడి., జె. సూర్యనారాయణగార్లకు హృదయపూర్వక కృతజ్ఞతలు. ఈ పుస్తకమును ముద్రించి సకాలములో అందించిన శ్రీ కప్పగంతుల భాస్కరరావుగారు ప్రత్యేకఅభినందనీయులు. క్రమంగా భాషాభిమానుల ప్రోత్సాహ సహకారములతో వీరిఇతర రచనలనుకూడా అందించడానికి సిద్ధంగా వున్నామని విజ్ఞప్తి చేస్తున్నాము.

ఇట్లు,

హీరాలాల్ మోరియా,

అధ్యక్షులు,

భా సా కళాపరిషత్

# శుభోదయము

హిమవద్గిరీంద్రాగ్ర రమణీయ ధావళ్య
కాంతులు విశ్వసంక్రాంతులయ్యె
బహుకోటిజనఘోష పట్టికలం దరు
ణోదయ రక్తిమ లుల్లసిల్లె
చీకటికలలలో చెదరిపోయిన పురా
ప్రతిభ యదార్థరూపముం ధరించె
భిన్నసంస్కృతులు విభిన్నవర్ణముల యం
దనురాగ బంధంబు పెనచుకొనియె

ఒక్కటే ఒక్క గొంతుగా, ఒక్క త్రాటి
పై సమస్తము నిల్చిన భారత ప్ర
భావ సమ్మోహనమున, ప్రపంచగతియె
నియతినందిన దీ శుభోదయపు వేళ.

శుభోదయము

నేటి కెనిమిదేండ్ల నాటిక్రితము గద్ది
నట్టి దీ యశస్సు పట్టణముల
పల్లెపల్లెయందు, ప్రజల గుండియలందు
వెలుగు నింపినట్టి దీయుషస్సు.

ఇది చారిత్రకఘట్టమీ యుదయ మొంతే పూజనీయాత్మకం
బిదిహర్షప్రద, మిద్ది మానవమహాదృష్ట ప్రభా రేఖ, ప్రా
త దరిద్రంబు నశించిపోయినది, నూత్నారంభముల్ జీవితా
భ్యుదయ ప్రాప్తికి సాగుచున్నవి...సుఖాబ్ధుల్ పొంగిపొర్లె
డిన్.

సర్వమానవ కల్యాణ సామ్యవాద
రూపమున జనరథసమారోహణం బొ
నర్చి, యీ యుషస్సంధ్యాపథాంతరమున
నడచివచ్చె ప్రజాశక్తి నాకడకును.

ఒక్కరి హక్కుకాధిని, మరొక్కరిదియ్యది కాకపోదు, యిం
దెక్కువతక్కువల్ కులముఁలీర్ష్యలు నిల్చెడి తావులేదు, పెం
పెక్కిన మత్తచిత్తుల బిభీషికలిచ్చట సాగిరావు, మా
ప్రక్కల పంచశీలములుమాత్రమె, నిల్చిచరించు స్వేచ్ఛగన్.

## శుభోదయము

నాకు చీకట్లు లేవు చీకాకులేదు
నాకొక నిరంకుశ ప్రభునాజ్ఞ లేదు
యే నౌకరిజాలిపై బ్రతుకీడ్వ లేను
నేను భారతశక్తి జీర్ణించుకొంటి.

ప్రాతన్ రోతయటంచు త్రోసిచన నర్వాచీన సంభావ్యతా
రీతుల్ మంచివి నేర్చుకొందును, అతియుద్రేకంబు పోనాడెదన్
స్వాతంత్ర్యంబును నిల్పుచాత్మయెడ విశ్వాసంబుపోనాడకన్
ఖ్యాతిన్ నే బ్రతుకోర్చుకొంచు బ్రతుకంగాచూచుకొందున్
భువిన్.

సంఘవిహారంగ వనలతాశ్రమములందు
వేయి పరిమళసుమముల పూయనిండు
ప్రజల పరిణత మేధోంతరాళమందు
వేయిసిద్ధాంతభాష్యముల్ వెలయనిండు

కోటిగుండెలయందు నిగూఢమైన
రాగవీణలు తీయగా మ్రోగనిండు
సప్తవర్ణాద్భుత ప్రభాచ్ఛటల వెలుగు
ఇంద్రధనువట్లు సంస్కృతి నెసగనిండు
యుద్ధమేఘాలఘాటితో దద్దరిల్లు
జగతిపై శాంతివర్షమ్ము సాగనిండు!

# ప్రభాతగానం

అదె యుషారాణి! పులకించె; నామె హ స్త
స్వర్ణకంకణ మంజునిస్వనలు దెసల
ప్రథితమయ్యెను తొలి యుషఃప్రసవరాజి
విరిసె, నిరుపేద గుండెలు వెలుగునట్లు.

అదిగొ! బాలార్కుడుదయించె నాతడే యి
కింతసేపాగినన్ ప్రళయాంతకుడగు
నట్లు గన్పడు మీమీ యనాథదశల
దాటి, చండాంశుడైన మార్తాండునివలె
విక్రమింపుడు దీనుల వేరుజేసి
కాలరాచు విశ్వమును దగ్ధంబొనర్ప.

నవభానూజ్జ్వల దివ్యకాంతికలితా నల్పాగ్ని విక్రాంతి క
ల్లవిగో కొండలుకొండలేకరిగి నాయాచోటులంనుండి, ది
వ్య విచూత్నంబగు వీణాతీవలవలెన్ స్వర్ణోజ్జ్వల త్కాంతితో
ప్రవహించెన్, దివిబ్రాక జొచ్చెనవిగో ప్రాభాతకాంతిస్ఫుటుల్

తెలతెలవారెరా! ఉదయతేజము. దిక్కులబ్రాకెరా! ప్రజా
బలమిటు వృద్ధిజెందునని భానుడు తూరుపుకొండనెక్కెరా!
కలకలలాడెరా జగము కాంతిమయంబగుచుండె వేచి, దు
ర్బలులకు రక్షగల్గు నిరపాయ స్థలంబును సృష్టిజేయరా!

గణగణ మ్రోగెరా విజయఘంటలు విప్లవభేరులే ఝుం ఝుం
ఝుణఝున సాగెరా బ్రతుకు చావులమధ్యన నున్న ఘోరజీ
వన బడబానలోజ్జ్వల ప్రభాయుతకాంతులు మిన్నుముట్టె ని
ర్ధన వ్యతిరేక సంఘమును దగ్ధమొనర్పగజూచె లేవరా!

ఉద్వేగల మానవత్వము నూడ్చుచున్న
ఈ వికృత పాపరూప ఝుకీపరివారా
మాపు జేయనిచో విశ్వమాగదింక
లెందు సుప్రభాతంబిదె లెందుల డు.

తూరుపుదిక్కునన్ విజయదుందుభి మ్రోగె, వియత్పథంబు రం
గారు మెరుంగు స్వర్ణమయకాంతులతో తళుక్కొత్తె, ప్రాక్ప్రభా
తారుణ రక్తకాంతి త్రిదశావృతమై కనిపించె, లెండు మీ
జారిన గుండెలొత్తుకొని సాగుడు ప్రాచ్యదిశాముఖంబుగన్

చిల్లులువోవసాగినవి చిక్కని చీకటికాంతకండ్లు ది
వ్యోల్లసితప్రభానవనవోదయకాంతి భరించలేక, న
ల్లల్లనవాడసాగినవి యాకలిచే తపియించు డొక్కలున్
ఎల్లకు లెండు మీరు పయనించెడిబాటల చక్కదిద్దుకోన్,

ప్రభాతగానం

ఓ నిరుపేదలార! విజయోదయమానసులౌచు సాగి రం
డో నిరుపాధిజీవితములూడ్చెడి యీ ధనరాజ్యసీమలన్
ఈ నరకప్రవాసముల నీ సరిహద్దులదాటి స్వేచ్ఛ, ప్రా
గ్భానుసమానులై దిశల బ్రాకగ రండిక లెండు వేగమే.

ఈ గంభీర ఘనాంధకార నటనావిన్యాసముల్ ఘోరమై
సాగెన్ పేదలగుండెపైన ఇటులచ్ఛంబైన చీకట్లలో,
వేగింపంజను నింతకాలమిక, యుర్వీచక్రమున్ ముంచగా
వాగుల్ వారె ప్రభాతకాంతి, మిము నాహ్వానించెరా లెండికన్.

కరడుగట్టినయాశతో పరితపించి
తీరుగట్టికోరికల యెడారిలోన,
ఎండి, మండెడిగుండెతో నుండ నేల?
రండు రండోయి విజయయాత్రార్థమరుగ.

ఎవరో కొందరు మంచివారలవ్వచో నేమౌనురా? నేడు భూ
ర్భువ స్వర్లోకములందుకూడ నటనంబున్ జేయుచున్నట్టి మా
నవ మాంసాశన రాక్షసప్రకృతి దున్మాడింపగా జేయ, నా
యెవరో కొందరివల్ల నేమగును మీరీ రీతిగానుండినన్.

# మాతృవందనం

త్రేయక్కోన లేని దాస్యాంధకారమున, సు
మారు నూటయేబదియేండ్లు మ్రగ్గినావు
జనని శ్రీ సుభారతీ! దివ్యజాత! మా న
మస్సులివె, జోతలివె యందుమమ్మ కరుణ.

చూచితిమి నాడు నీ రోష శోకములను
నీ కవోష్ణాశ్రుబిందువుల్ నేల జాలు
వారి, ప్రవహించిముంచె నీ వసుధనెల్ల
పగిలె హృదయాలు నీ ముద్దుపాపలకును.

శిథిల శిలావతారముల జీర్ణహృదంతరమందునిల్చి, సం
పదలను గోలుపోయి, వసివాడిన నీ ముఖపద్మరేఖలో
ప్రథితయశుండు గాంధిముని పావన తేజముసృష్టిజేసె, మా
హృదయసరోవరాల వికసించెను తామరపూవులప్పుడే.

శిథిలశిలలకు మఱలను జీవమబ్బె
జీర్ణహృదయాలు తిరిగి క్రొంజివురులెత్తె
ఘన స్వాతంత్ర్యేచ్ఛ పోరాడు కర్మవీర
యువకసింహాలగర్జనల్ భువిపగిల్చె.

మాతృవందనం

ఘనశీతాచల, వింధ్యభూధర, మహోగ్రారావళీపంక్తి, మే
రు నగోత్తుంగశిఖాగ్రమందు జయభేరుల్ గట్టె. మ్రోగించి, వె
చ్చని క్రొన్నెత్తురు పారజేసియు స్వరాజ్యప్రాప్తిగల్పించి న
ట్టి నరుల్ పుత్రులుగారె నీకు భరతోర్వీ! మాకు అండల్ గదే.

ఎన్నో జన్మల మేము నోచిన తపాలెంతెంతవో కాని, మా
యన్నల్ సత్యవచఃక్రియాత్ములయి నీ యాకాంక్షలన్ దీర్చి, ని
న్నెన్నో రీతుల సాటిదేశముల మేటిన్ జేయనూహించి, తా
మున్నారమ్మ! త్వదీయదీవనలని మ్మోతల్లి! మా భారతీ!.

సర్వతంత్ర స్వతంత్రరాజ్యాధికార
దీర్ఘ పుష్పమాలిక నీదు దివ్యగళము
నందు నిలిపిరి నీదు పుణ్యాంపుసుతులు
నేటితో నీవు సంపూర్ణ నిశ్చల స్వ
తంత్ర వ్యవహార్త్రవిక నేమి తక్కువమ్మ!
చేసెదరు నీకు మూర్ధాభిషేకమిపుడె

ఇది యీనాటికి గల్గినట్టి ఫలమిట్లెన్నో యుగాంతాలు నీ
విదితంబైన యశస్సు నిల్చును... చిరావిఖ్యాతమై చాల దొ
డ్డదియౌ నీ మతంబు విశ్వదిశలన్ ఢంకాబజాయించు, నీ
కెదురేలేదు జగాన, ముందుకు స్వతంత్రేచ్ఛన్ ప్రయాణింపుమా!

# జీ వి తా ద ర్శ ము

ఆరదు నా కవిత్వపు మహాగ్ని పరాభవమౌనుదాక, చ
ల్లారవు వేడి భావనలు రాక్షసులన్ సమయించుదాక, నా
వారలు దుఃఖపీడితుల బాధనశించెడియంతదాక, నా
స్వైరవిహారమాగదు ప్రజన్ సుఖముల్ వరియించు
దాకనున్

తీరని కోరికల్ హృదయతీవ్రత బెన్నగ జేయు, తీర్చుకో
దారులు లేక, గొప్పధనదార్ఢ్యత లేక, యెదన్ గృశించి, చ
ల్లారని వేదనాగ్ని శిఖలందున మాడు దరిద్ర మానవా
కారులు, నాదు సోదరులకై కవితన్ బ్రచురింపజేసెదన్.

ఏనాక మహాదరిద్ర రాజేశ్వరుడను
నాకవిత్వము దీన జనాళికొఱకె
జోగి జోగి రాచుకొనంగ జోలెనుండి
రాలునో బూది లేక, కాలానలశిఖ
లుద్భవించునో యొరపిడి యుండుకతన,
ఎంచి యీశక్తి నిక పరీక్షించుకొనెద.

ఎవరే లేదిక నాకలానికిక ఏ రేమున్నను గూడ నా
యెదలోనుండు మహాగ్ని జ్వాలలకు చన్నీరే కవిత్వంబికన్
పదునెక్కింతు పవిత్రలేఖినికి దర్పంబొప్ప లంఘించి, కూ
ల్చెద దౌర్భాగ్య ప్రపంచగోళమును దోర్లీలా ప్రభావో
న్నతిన్.

వట్టి డాబులు గావివి, గట్టి ప్రతిన
యవ్వనిది మదీయ జీవితయంత్రమే శి
థిలముగానిమ్ము, కాని నా దివ్యదీక్ష,
చెదరదేనాటికైనను బెదర నేను.

# శ ర ధా ర

నా శరధార పీడితజనాళి కవోష్ణ ప్రగాఢరక్త మా
పోశనజేసి, మత్సరపుమూల్గులు దిక్కులనింపి, స్వార్థులై
దేశవికాససంపదల తేఱమఱంగిన లోభదేవులన్
నాశమొనర్చి దీనులమనంబు వికాసమొనర్ప జేసెడిన్.

నరసంఘంబులనేతలై నిలచి నానాకృత్యముల్జేసి సుం
దరమౌ విశ్వము పాడొనర్పగ ప్రయత్నంబుల్ సదా జేయు ము
ష్కర దౌర్భాగ్యపిశాచమూర్తుల దురాశాబద్ధులన్ గాల్చు నా
శరధారల్ ప్రళయాగ్నికీలలయి యాశాంతంబు గావించుతన్.

ఘన గాండీవ ఝణంఝణధ్వనుల లోకాలెల్ల కంపింప భీ
ష్మునితృష్ణన్ వెసదీర్పగా, శరములన్ జొప్పించి పాతాళగం
గను రప్పించిన పార్థురీతిగ ప్రజాకాంక్షల్ దరిన్ జేర్చ తీ
రని త్యాగంబొనరించ నాదు శరధారన్ సంప్రయోగించెదన్.

ఏదో జిత్తుల మాయనాటకములెన్నెన్నో ప్రయోగించి, నూ
త్నాదర్శంబిదియంచు జెప్పి, ప్రజలన్ నమ్మించి, పీఠాలు సం
పాదించంగను జూచుచున్న పదవీవ్యామోహాలు ధూర్తాత్ములన్
బాధించున్ శరధార శూలసమమై, ప్రచ్ఛన్నమై, మృత్యువై,

నీచులై రాక్షసత్వమునిండుకొన్న
మనసుతో మానవత్వముమరచినట్టి
కర్మశూన్యుల, ద్రోహుల కఠినహృదయ
భేదనమొనర్చు శరధార పిడుగువోలె.

# వె లు గు బా ట

ఇట గాఢాంధముతప్ప వెన్నెలలు లేనేలేవు, దట్టంపు చీ
కటి పర్దాల్ మిము గప్పి వేసినవి ప్రాకారంబుగా దాటరా
నటులన్, జ్యోత్స్నలులేని మీ బ్రతుకులన్యాయాలు, నిస్సార
ముల్,
ఇటులెన్నాళ్ళుగనుంటిరో తెలియదెన్నేండ్లో యుగాలో కదా ?.

భగ్నములైన ఈ బ్రతుకుబాటలె రాజపథాలుమీకు, ఈ
నగ్న పిశాచనాట్యములె నాటకముల్, ప్రతిపత్తియున్ మహో
ద్విగ్న మనస్కులై పరితపించుచునుందురిదేమి? వీనిలో
మగ్నులరై, విషప్రళయమారుతమునందున దూలిపోదురా ...?

ఇదియొక స్వాప్నిక క్షణికవిశ్వము, దీనినియావరించి యు
న్నదియొక మాయచీకటి అనాదిగతంబయి, యీ తెఱల్ ?బదా
బదలుగజేసి, నూతనప్రభల్ తిలకింపగజేతురందు, రం
డిదె యవకాశమింక లభియించదురా! మరియొక్క నాటికిన్.

ఈ చీకట్లనుచీల్చు, నావెనుకరండీ! స్నిగ్ధ దివ్యప్రభా
వీచీ శ్రేణుల దేలియాడగ, మహోత్కృష్టప్రదేశంబు కా
లోచింపన్ పని లేదు మీకును, విలోకింపన్ గనుద్వ్యాప్పు ఈ
ప్రాచీనద్రిసహీన ధ్వాంతయుత వ్యగ్రారణ్యభాగంబులన్.

అక్షయమైన ఏ బ్రతుకులంచుతలంచెదరొక్కమారు సా
పేక్షగనన్ను గాంచుడు విభీతములై పరుగెత్తు చీకటుల్,
ఈ క్షణమందె రాదలచిరేని రయంబున రండు! రండు! నా
దక్షిణరాజ్యసీమను ప్రధానవిచిత్రవిలాస భూమికిన్.

ఆ మలయద్రికంద్రశిఖరావృత హైమనసమీరబాలికా
హేమకరాలస్పర్శ పులకింపగజేయునుమిమ్ము, ఒక్క మా
రామధురానుభూత వివశాత్మతనందినయంతనే నిజం
బేమొ మెఱుంగజాలు మరికిప్పటికైన గ్రహించుకొంటిరా...?

నావిధిమిమ్ములన్ వెలుగుబాటకుపిల్వ, అనంతమూ మహా
శ్రీవిభవంబులన్, బహువిచిత్రదశల్ వెలుగొందు కాలపున్
త్రోవలుజూపుచు-మనసుకోపనివారలు కోరుకొన్నచో
ఈ విరతిప్రదేశమునకే మరలింతును రెప్పపాటులో.

యింతగమిమ్ముగోరుటిది ఎందులకో తెలియంగలేరె?
రవ్వంతసుఖంబులేక భ్రమపాలయియుండిన మిమ్ముజూచి నా
స్వాంతము తల్లడిల్లును, ప్రశాంతతపీడితొపింపు, భీకర
ధ్వాంతములోన మిమ్ముగనధర్మముకాదు మదీయసేవకున్...

---

మరణశయ్యమీదనున్న నిరుపేద కళాకారుని హృదయ కవాటాన్ని తట్టి, ప్రేమగా, లాలిస్తూ, ఒక మహాతేజోమూర్తి వినిపించిన పలుకులు ఇవి!

# మహాస్మృతి

సహజ సుందరమైన యీ గహనసీమ
విరియబూచిన మోదుగవృక్ష మొకటి
విరిగి నేలనబడిపోవ పరితపించి
కోటి రసహృదయాలు గగ్గోలు జెంద
నా తెలంగాణగుండెలో కోతగలిగె॥

కల్లనైనన్ సుఖశాంతి సంపదలెరుంగన్ లేక దౌర్భాగ్య రా
జులపాలిన్ బడి నెత్తురోడ్చి గళితాత్మ స్వాతంత్ర్యులౌ కోటి త
మ్ముల నిట్టూర్పులందు విప్లవము మార్మోగించి చేకొట్టి యీ
తెలగాణంబును పైకి నెత్తిన సుబుద్ధీ నీకుజోహార్లురా!!



శరధార

మిథ్యాకల్పిత నైతికాచరణలున్ మృత్పిండరూపుల్ ధనా
రాధ్యుల్ దుర్వ్యసనప్రవర్తనుల తంత్రాల్ నిర్మూలింపగా
ఆద్యంతంబు మనోవ్యథల్ పెనగొనన్ అర్థాంతరంబంటు నే
యధ్యాయంబు ముగించినావు గద అన్నా! నీ చరిత్రంబులో॥

ప్రారంభోత్సవదివ్యకాలమిది ఆంధ్రప్రభవస్ఫూర్తికిన్
ప్రారంభించినహోమకుండము మహాంధ్రంబు న్గనంబోక, చ
ల్లారంజాలదు ఈముహూర్తము సహాలక్షస్తుతిగీతుల్ గానగా
జేజేల్ హోయిల మ్రోగళాలు నినదించెన్ నీ మహాకీర్తికల్

కేశవరాయా! ఇది నీ
కోసం పాడినగీతం
కలఃపట్టె తెలంగాణ
కన్నీళ్ళకు రూపునిచ్చి
గళాన్నెత్తి తెలంగాణ
పొలమంతా తిరిగి తిరిగి
నీకోసం పాడామిది
నీకిదిగో భక్త్యాంజలి॥

# తిరిగిరాని సర్దార్



ఓయి పథికుడా! ఇలువీడియొంటిగ పయ
నించెదెటకయ్య...? నింగియందేమిగలదు?
పరిజ్వలితుడగుచుండెను భాస్కరుండు
అలసిపోయెదవడుగిడవలదు ముందు.

"ఆగుము...దూరభారపు ప్రయాణము జేయుచునుంటి వింటిలో
నేగలభాజనించె ఇది నేరనియట్లునటించి ఏదో వ
న్నాగము బూని, పిల్పునయినన్ విననంతటి దూర మవ్వడే
సాగితివేమి? ఇంచుక పరిశాంత మనస్కుడవౌచు నిల్వుమా!

"జీవితమెల్ల కాలమును సేవకుసమర్పణజేసి, మాప్రజా
భావములందు ఎన్నడెడబాయనినీడగనిల్చి, నేతవై
నావు, గురుండవై మెలగినావు, నయాన, భయాన అందరన్
త్రోవకుదెచ్చి, నేడు విడద్రొక్కితివా సరదారువోటచే.

"ఇదిగో! నీదువియోగబాధవలనన్ వెర్రెత్తి, సంక్షోభ దుః
ఖ దవగ్నిన్‌బడి మాడుచున్నది ప్రజాగంభీరలోకంబు, అ
ల్లదిగో! చేసెడికార్యముల్ మరచి నీరైపోయె కాళ్ళాడకన్
వ్యథలన్ కుళ్ళెడి తోటిసేవకసమూహంబెట్లుగూర్చుండెనో.

"మాయనిగాయమైనిలచె మాహృదయాలపయిన్ మహాత్ముడ
న్యాయము జేసిపోవుటయు, నారమణర్షి యునట్లె, మొన్న నే
మాయరవిందయోగి అదెమాదిరి మాయమయెన్, ఇదేమి య
న్యాయము...? నీవుకూడ పయనంబొనరించుచునుంటి వింతలో

అవునా? దేశమువీడిపోవుటకిదయ్యా వేళ? ఈయిల్లు నీ
దవుకాదా? మహామరాత్ములు, సుఖవ్యాపారులా వారలిం
కవలీలన్ చెలరేగి ఈగృహములో కల్లోలముల్ లేపరా
అవురా! ఎంతయరిష్టమబ్బెగదనయ్యా! నీప్రయాణంబుచే.

"ఎన్ని యుగాలకైన ప్రభవించదు నీ సముద్రైననేత- ఇం
కెన్ని యుగాలకైన విజిగీష నశించదు మాకు దేశమె
న్నెన్నో విధాల నిన్ను గురుతించినగాథలు బాధలౌచు, మా
కన్ని విధాల దుఃఖములనావకగూర్చుచు జీవితాంతమున్.

"ఇప్పటికైన మాపిలుపు నింత చెవిన్ బడనిమ్ము, మేమెటున్
చెప్పెడిదింక లేదు, మరిచేసెడిదేదియు లేదు కాని, నీ
వెప్పటికైన ఏదిశకు నేగిననైనను, భారతీయులన్
తప్పక ఒక్కకంట విదితాత్ముడవై కనిపెట్టియుండుమా!

కడుపులో వేదనాగ్ని యంగాంగముల ద
హించుచున్నది, ఎంతరోదించిన సరె
రావు నీవిక అశ్రుధారా స్రవంతి
యందు మున్గుట కర్తవ్యమాను మాకు

నీపవిత్రాంతరాత్మకు నేటినుండి
పూర్ణశాంతిలభించుత. భూమియందు
నీవొనర్చిన కార్యముల్ నిఖిల మాన
వాళి కాదర్శప్రాయమైవరలు, ఇంక
నిల్తుమిచ్చటె, నిన్ను ధ్యానించుకొనుచు!

# ఆలోచన ......

.........( ఆవేదన )

నీప్రపంచవిశిష్టత నీకెముదము
గూర్చుగాని, దుఃఖాంబుధిన్ గుర్తింపు, మూఢు
రంత జీవితములకును సంతసంబు
గూర్పజాలదు ఓ దొడ్డనేర్పుకాడ!

నీవేసృష్టియొనర్చినావు జగమున్, నీపేరనే రోజు కె
న్నో వేలాది యకృత్యముల్ జరిపినన్ నోరెత్తనే లేవు, దే
వా! వారింపగలేవు సంఘమున నీభక్తాగ్రణుల్ చేయు, దు
ర్భావోద్రేకమహా నికృష్టయుత దౌర్భాగ్యంపుటైశ్వర్యాలన్

ఎందుకు మమ్ము సృష్టియొనరించితివో తెలియంగరాదు, గ
ర్వాంధుల మోటుపాదములరాపిడికిన్ బలిజేయనా? మహా
నందపథంబునన్ బ్రతుకునాళ్ళు ముగింపగనా? రవంత, యీ
సందియమున్ పరిష్కరణసల్పుము దైవమ! నీకు మ్రొక్కెదన్.

పాపంబన్న పదంబునే వినని మా పాపల్ క్షుధాపీడితుల్
రేపుల్ మాపును జోలెచంకనిడి, "తండ్రీ భిక్షమో" యంచు ఎ
న్నే పాట్లం బడుచున్న జూచెదరు కానీ, ప్రేమనోరార, "రా
రా! పాపా!" యనిపిల్చి భిక్షమిడు ధర్మాత్ముండు లేడో ప్రభూ!

కళకళలాడు చెక్కిళుల కాంతి ముఖంబున వెల్గునింప, ది
వ్య లలితముగ్ధభావనల వచ్చియుతానిపయస్సుతో, మన
స్సుం గిలిగించివేయు నవసుందరి నేలను సృష్టిజేసితో
మలమల కూడుగుడ్డలకు మాడ్చి తపింపగజేయనా ప్రభూ!

శోభనశించి, పూచిన యశోలతికల్ మొదలంటనెండి, ఎ
న్నో భయదంబులౌ శ్రమలనోర్చి, కృశించి, నిరాశజెంది సం
క్షోభమహాగ్ని దగ్ధులగుచున్న జనంబుల గావలేని, నీ
వా భువనైకరక్షుడవు...? వాకొన సిగ్గనిపించు దైవమా!

ఎక్కడిశోక నిస్స్వనమిదే దెశనుండి వినంగవచ్చె, నే
బక్కపకీరు గుండెలను బ్రద్దలుచేసిరో, దుర్మదాంధు తే
దిక్కునచూడలేకను గతించిన పేదసుతుం గురించి, ఏ
చక్కనితల్లి రోదనము సల్పెడినో వినుచుంటివా ప్రభూ;

కరుణానందమయా! మదీయసుఖస్వర్గారామమునందున్న, సుందర రత్నఖచితంబునై; తళతళత్కాంతుల్ ప్రసారించు, చిత్రమువుల్ గల్గిన సింహపీఠమును పాతాళంబునన్ ద్రోసి, గందరగోళంబానరించి నాబ్రతుకులో దావానలల్ రేపితే...?

ఇదినీవిస్తృత విశ్వగోళచరితం బెన్నాళ్ళు మూచి త్తముల్ వ్యథతో నిట్టుల కృంగజేసెదవు? దేవా! వ్యర్థులన్ జేసినా! మదమాత్సర్య ప్రచండవహ్నిబడి దౌర్భాగ్యంబుగా జచ్చు దునుమజల్ ప్రాయూట జెల్లునా? ఇవియు మున్నూరేండ్లకున్ దప్పదా?

ఈలోకంబున సత్యవర్తనను ధర్మేచ్ఛల్ గనజాలము, ఘోరాలాచెప్పగలేము, దీనజనులన్ రాపాడి, హింసించు, శార్దూలావాస భయంకరాటవిగ, నిరూపంబునైపోయె ఇంకేలా నీప్రళయోగ్ర తాండవము సాగించంగ రావో ప్రభూ!

నీయశస్సు శాశ్వతముగా నిఖిలవిశ్వ
గోళమందున చిత్రించగోరి తేప
క్రీతము నీపేరుమీద సాగించినట్టి
ఈ సురవ్యాప సాంఘికహింసలకును
బాధ్యతవహించి, పేదల బ్రతుకులయి
నమృతధారలు చల్లి చల్లార్పుమగ్ని.

# ఎవరికి తెలుసు.....?

వెలుతురునుమింగి మిక్కిలి బలిసిపోయి
నట్టి, తమసము, తనకుదానె సృజించు
కొన్న తెఱలను ఛేదించి, కన్నుదెఱచి,
వెలుగుబాటలు నడచిన వీరుడెవడొ ?

భయద మృత్యుప్రభంజనార్భటిని ధైర్య
శక్తిగా భరియించి, దిశాంత వ్యాప్తి
మైన సామ్రాజ్యస్థాపనకై ప్రయత్న
ముల నొనర్చెడి, మూఢుల మూర్ఖమెంతో...?

రత్నమకుటధారులు మహారాజకములు;
బ్రతుకు నేలకంటగ ద్రొక్కబడిన నరులు.
ఒకప్రదేశాన సములయి యుండుటకును
రావలసియున్న ఘోరప్రళయమదెంతో...?

అందరికీ అందరాని ఆనందమయ సు
ధామధుర జీవితానుభోక్త లభించు
నాశలో, చిచ్చురేపుకొన్నట్టి వ్యక్తి
మానసికమైన వేదనపారమెంతో...?

అతిప్రమాదభూయిష్ఠ జీవితపథాన
నడువలేకొంటిగా, నవనాడులు కృశి
యింప, ఈమార్గమును విసర్జించి, శాశ్వ
తుడనై పోను, అవసరమైనపుడిను తెన్నొ...?

త్యాగమొనరించి, ప్రాణాలు ధారవోసి
నిలుపుకొన్న సంపద వారి నెత్తిగొట్టి
దోచుకొని, దేశదేశాలలో చరించి
పెంచుకొన్న ప్రతిష్ఠకు విలువయెంతో...?

# ఏ మ ని వ్రా యు దు న్....?

ఏమని వ్రాయుదున్? హృదయమే ఇసుమంతయు లేని క్రూర దీక్షా మదమత్తులైన లయకారుల హస్త శతఘ్నికిన్, స్వసేవా మహితాత్ములౌ తెలుగువారల గుండెల నప్పజెప్పుచున్నా మన: వ్రాయనా...? పయిని, నా కల మెట్టుల సాగు సోదరీ

ఎక్కడి పాడులోకమిది. వేమి మహాప్రళయాగ్ని, దీని కింకెక్కడ తావు లేద? రమణీయ మనోజ్ఞ కళామతల్లి! నీ దృక్కులు మాసిపోవగ సతీమణులార్చగ మారణాగ్ని, పెంపెక్కిన రాక్షసేచ్ఛతో దహించెను సోదరి! నీ శరీరమున్.

ఇది సయుజ్యాల దేశసేవ ఫలమా? ఎన్నో శతాబ్దాల సంగ్రధితానూన తెలుంగు నాగరికత ప్రాశస్త్యమా? లేక, దుర్మదపైశాచిక, వికృతంపు నటనంబా? ఏదియో? చిత్రహా వధకన్ పాలయితీవు, దేశ చరితల్ వర్ణించు నీగాథలన్.

